శ్రీ రామజయం.

# కాలము.

దీపాల పిచ్చయ్యశాస్త్రి,

కృతము



ఆనందముద్రణా

ముద్రితము.

మదరాస్.

1920.

 వెల అణాలు. 3.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

# తొలిపలుకు.

నే నప్పుడప్పుడు నుబుసుపోకకై కాలమునుగూర్చి యొక కొన్ని పద్యములను రచించియుంటిని. ఆపద్యములను:— నెల్లూరుమండలములోని మడమనూరు పుర వాస్తవ్యులును, కవితాప్రియులును, నాకుమిత్రులునునగు బ్ర॥ శ్రీ॥ గుడ్డాడ సిద్ధేశ్వరశర్మగారిటీవల ప్రస్తావవశమునవిని, భావములు నూతనములనియు, శైలిమనోహరమనియు మెచ్చుకోలు దెలిసి, "యీరీతి నే ప్రకృతికాలస్థితినిగూడ వెల్లడించుచు మఱికొన్ని పద్యములు విరచించి, యొక గ్రంథముగాఁ బ్రకటింతురేని యీ పద్యములు, పండితాదరణపాత్రములై, సర్వజనపఠనయోగ్యములై, ఆంధ్రలోకమున మిగుల వ్యాప్తిం జెందిన, మీకును యశంబానంగఁ గలదు; అట్లొనరింపుడు." అని నొక్కి వక్కాణించిరి. శ్రేయోదాయకమగు నా ప్రవచనము నతిక్రమింప మనసొప్పక, అచిరకాలముననే నే నీకృతిని రచించితిని. రచించి నామిత్రులకు వినిపించితిని. వినిపింప, రసికులును, భాషాభిమానులును, కవిపండితబాంధవులును, సహాయోదారశీలురును నగు శ్రీశర్మగారానందించి, "యీకృతికి నన్నుంబతిం గావించి నాకుతూహలము దీర్పుం" డనికోరిరి. మిత్రాభీష్టమును నెరవేర్చుటకన్న నుత్తమకార్యమింకొండు గలదా? ఇంతటి భాగ్యము నాకీనాటికిం గదా లభించెనని పరమానందభరితహృదయుండనై పుత్రపౌత్రాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి గృతీశ్వరున కొసంగ సర్వేశ్వరుని వేడుచు సిద్ధేశ్వరున కీకృతినంకితముం గావించితిని.

1. కాలమహిమము 2. దేశస్థితి 3. సంఘాచారములు 4. కవితావిషయము 5. శాంతి అనువిషయములను మనము సందుంచుకొని నేనిందలి పద్యశతమును వ్రాసితిని. రసారస విచారము రసజ్ఞులకు వదలి తప్పులను క్షమింపఁబండితులను ప్రార్థించెదను.

20—1—20.
మదరాస్.

ఇట్లు,
గ్రంథకర్త.



# అంకితము.

---

శా. శ్రీచెన్నారఁగ యుష్మదస్మదసమ
స్నేహోల్లసద్వల్లికం
బూచెఁ బొంపగునీకృతిప్రసవమీ
పుష్పంబు యుష్మద్యశః
ప్రాచుర్యోత్తమగంధబంధురము విద్వ
ద్భృంగసంశోభమై
యాచంద్రార్కముఁ బొల్చుఁ గాతసుకృతీ
యడ్డాడసిద్ధేశ్వరా!

క. కవులఁ బ్రేరించి యిట్టి యింకను బ్రశస్త
కృతుల వెలయించి బహుబహూకృతుల వారిఁ
బ్రీణితులఁ జేసి కీర్తి నార్జింపుమయ్య
సిద్ధసంకల్ప! అడ్డాడసిద్ధశస్త!

---

శ్రీమత్పరదేవతాయైనమః.

# కాలము.

---

చ. తిరముగ నే జగజ్జననిదివ్యపదంబు నెడంగడింతు నే
నిరతము భక్తిఁ, దజ్జనని నిత్యశుభప్రదసత్కటాక్షశాం
కరి కరుణన్ సహాయమొసఁగన్ గృతినేతగ నిన్నొనర్చి నే
విరచనసేయు నీ సుకృతివిశ్వనుతింగనుఁగాత కాలమా. 1

మ. అరయన్ నీకును నాకు లోకులకుఁ బూజ్యంబైన శ్రీవేంకటే
శ్వరపాదాంబుజముల్ మదిం దలఁచి శశ్వద్భక్తి నాశించి నే
విరచింపం దొరకొంటి నీ కృతిని నీ విఖ్యాతి హెచ్చించుచున్
సరసంబియ్యది యని సందుకొని తోషంబందుమా కా. 2

మ. సకలాచేతనచేతనప్రతతి నిచ్ఛారీతి శాసించు ని
నకలంకంబుగ నే పనిన్ సలుప లేవంచందు రా నట్టిచో
నిఁక గణించితి జ్ఞుఁడనా యొనర్చుకృతిలో నన్నేని దోషంబులు
డకపో వున్న మఱేమి ప్రాజ్ఞులును నన్మన్నింపరే? కా. 3

చ. నృపతుల మెచ్చుచుం గృతుల నిచ్చుచునుండు రసత్కవీంద్రు
లా నృపతులు మెచ్చుకోలుగ రెట్టులొ మెచ్చిన నిచ్చునద్దిరా
చెపుభృతి. నీ కృతిన్ వినుతిచేసి భవత్కృపఁ గన్నచో ధరా
ధిపతులు కాఁగలారను మతిన్ గృతినిచ్చుచునుంటిఁ గా. 4

ఉ. నీమహిమంబు నీసుగుణనిస్తులశక్తులు నీదు దుర్గుణ
స్తోమము నీదులోపములు తోడనె నీదుమహోన్నతస్థితిన్
నేమొఁగ మోహకీకృతి గణింతును దప్పగ నెంచఁబోకు మీ
నేమము సేత యెందులకొ నీకు నెఱుంగఁగరాదె? కాలమా. 5

ఉ. మూలమవీవ లోకములు పుట్టగ గిట్ట, శుభాశుభ ప్్రజా
వాలమవీవ, సంతత శివంకర దివ్యగుణ ప్రశస్త స
చ్ఛీలమవీవ; దుష్టజన శిక్షణ దక్షదురంతరూక్ష దృ
గ్జాలమవీవ; అట్టి నిను సన్నుతి సేయఁ దరంబె? కా. 6

ఉ. కాలమ! యేమసందు నినుఁ గంఠము జుట్టిన పాము మాలతీ
మాలికఁ జేయ నేర్తు, సుమమాలిక కంఠమునన్ ధరింపఁగాఁ
గాలవిషాహిఁ జేయుదు వకారణ కారుణికత్వ మట్ల యా
భీలవృథాకృధాధిక బిభీషికలూనెద వెంత దాసవే. 7

చ. విధియు విరామమున్ విసుగు వేసటయున్ గనకెల్ల వేళ దు
ష్పథమని సత్పథంబని విచారము సేయక పోవుచుందువే
విధమున సన్నుతించినను వెండియుఁ గంటికిఁ గానరావు నీ
విధము తలంచినన్ మదికి విస్మయమౌఁ గదవమ్మ కాలమా.

ఉ. ఎన్నియుగంబు లేగినను నెన్నికకందని బ్రహ్మకల్పముల్
చన్నను నాఁడు నాఁటికి నిజవ్వన మెచ్చెడుగాని నీకు నా
పన్నత గాని వార్ధకపు వంతలు గాని ఘటిల్లఁబోవు నీ
పున్నెము నేమనందుఁ దలపోయఁగఁ జిత్రమటందుఁ గా. 9

చ. కనకకిరీటధారణ సుఖమ్మున నొప్పు శిరమ్ము నంతలోన్
గనికరమింత లేక కడుఁగష్టపురీతినిఁ బేడతట్ట మో
యను నియమించునట్టి కఠినాత్మవు, నిక్కము నీ మొగంబుఁ జూ
చినఁ గడుఁ ఘాతకం బౌదవు నీ యికఁ వేయన నేల? కాలమా.

శా. ఎన్నన్ రాని దరిద్రతాభరమునన్ హీనస్థితిం గన్న యా
పన్నున్ బన్నుగఁ బేర్మిఁ జూచి బహుళవ్యాపారతన్ వేలసం
పన్నున్ జేయఁగఁ జాలునట్టి కరుణాపాథోధి వీ వౌట నీ
కన్నన్ దాత జగాన లేడనుచు వర్ణింతునో కాలమా.

చ. పుడమినిఁ దల్లికంటెఁ దలపోయఁగ నీవిఁక నెన్నిరెట్లొ మే
లడుగక పెట్టదమ్మ సమయమ్మును జూచి యొసంగుచుందు వీ
వడుగక మున్నె కాని తనివారఁగ బెట్టక క్రూరచిత్తతన్
నడుమ నెముంతు వక్కతన నల్గురు రోసిరి నిన్ను గాలమా.

ఉ. పమ్మినసంపదన్వెలయు పార్థివుఁడొక్కట భిక్షుమెత్తు భి
క్షుమ్మునఁగాలముంగడపు కష్టుఁడు పార్థివుఁడౌను నీవొగిన్
"గ"మ్మునఁగాని కార్యముజగమ్మునఁగల్గునె? బ్రమ్మిఁదిమ్మిగాఁ
దిమ్మినిబ్రమ్మిగాసలుపు దిట్టవు నీవగుదోసికాలమా. 13

మ. ధనికుండంచు సలాముచేసి తలపైఁ బాల్పంగఁ బో వెప్ఫు ని
ర్ధనుఁడీతండని నిర్దయంగసరి "పోరా" యంచుపంచింపవు
ర్విని నిన్ బోలినపక్షపాతరహిత శ్రీమంతు లెవ్వారు తే
రని ముమ్మాటికి నొక్కిచెప్పెదను నీవ్యాప్తిలమా! కా. 14

మ. తనజన్మంబుఁ బరోపకారమునకై తథ్యంబ వెచ్చించు స
జ్జను బ్రేమింపవు, లోకముం జెఱచుచుచ్ఛ్రాతిమా వృత్తిపెన్
ధనధాన్యాయువులిచ్చిమన్చెదవి దేన్యాయంబుగా "తాపరిం
చిన దేరంభయుఁ దామునింగి సదియే శ్రీగంగయుం"గా. 15

శా. న్యాయంబెట్టులొ యట్టులేచ నెదవన్నా! లంచముల్ కోట్లియ
న్యాయాక్షంబును ద్రొక్కఁ బోవుపరకీయాత్మీయభేదంబున
న్యాయన్ లోకులముంప నెంచవుజగన్న్యాయంబునీచన్యయున్
నీయుద్యోగిత; రాజులందుఁ గలరా నీవంటివారొక్కలమా.

మ. ఒకకుగ్రామపు లెక్కతీర్పుటకెయెంతోమందియుద్యోగులూ
రకతంటాల్పడుచుందు రారయ సహస్రంబౌజగంబెట్లునీ
వొకచేతన్ సవరింతువో, ఫలమదేమో జీతమా? బత్తెమా?
ఒకమేలైనను లేదె యేమిటికి నీ యుద్యోగమో కాలమా.

ఉ. జంకవు బ్రహ్మకైనఁ, గొనసాగవు నీయెడ స్తోత్రపాఠముల్;
మంకుల లెక్కఁబెట్ట; వవమానము మానను చూడబోవు; ని
శ్శంకఁ దలంచినంత పని సల్పియె తీరుదు; విట్టినీకు వి
ద్యాంకులు మెచ్చి ధీరబిరుదాంకము నీయఁగరాదె కాలమా. 18

ఉ. మంచిని జెట్టగాఁ జెడుగు మంచిగ నేటికిఁ గ్రిందు మీఁదుఁగా
వించుచు ముందు వెప్పుప్పృథ్వీస్థలి నున్నది యున్నయట్లుగా
నుంచవు వేడ్కకైన; నిటులొప్పను దప్పుగఁ దప్పునొప్పుగాఁ
జంచలబుద్ధివై కతన నల్పదవో? అటు కాదొ? కాలమా.

శా. ఆకాశంబునఁ గట్టనేర్తువు గిహా ర్మ్యంబు, గొడ్డుబంధ్యాసుతుల్
ఫీఁకెన్ గోపురముం బనేర్చెదవు, "రండీయానభఃపుష్పముల్
ఈకుందేటి విషాణముల్ దొరకె నింకెచ్చోటు" నన్ నర్తకుం
డై కేరన్; బొనరింపనీ కొకఁ డసాధ్యంబుండునా? కాలమా.

ఉ. లేవు పదంబు లక్షులును లేవు శ్రవోద్వయి గానరాద యే
త్రోవను గన్నగోళము యెదో వదనమ్మెటుఁ గంగ రాం దహో
నీవు చనన్ గనన్ వినఁగ నేర్తువు లోకము మ్రింగ నేర్తువో
రావిన రాదెటన్ గనఁగరాదిటువంటి మహత్తు కాలమా. 21

ఉ. సాగరము ల్వడిన్ దుమికి సద్యశముం గడియింపవచ్చు, బా
హాగరిమన్ హరుం జులకనాడఁగనచ్చు, విషాహిశయ్యగా
భోగములందవచ్చుఁ గడుఁ బూజ్యతఁ గాంచగవచ్చుఁ గాని ని
న్నాఁగఁగ రాదు, వాసరనరామునీరుల కెందుఁ గాలమా.

చ. జగమను సంద్రమందు భవసంగ పరస్పర మత్సరంబునన్
బగ వగ కష్టముల్ సుఖ మపారముగాఁగను ప్రాణికోటిమ
త్స్యగణముననంతకంతకును నంతమునందఁగఁ జేయజాలు తీ
క్ష్ణగతిఁ దనర్చునట్టి పెనుగాలమనందగు నిన్నుఁ గాలమా. 23

చ. ఇనశశిదీపయుగ్మ మొనయించి, దివంబును రాత్రియుం దెరల్
పొనరిచి, నాట్యరంగముగ భూతలముం రచియించి లోకులం
దనరఁగ బాత్రముల్ సలిపి, నాఁటికి నేఁటికి నంతు లేని య
త్యనుపమ నాటకంబొకటి యాడఁగఁ జేసితివౌర కాలమా. 24

ఉ. ఓదము త్రివ్విపట్ల పురులొడ్డవు, మందులు లేవు, మంత్రతం
త్రాదుల నుచ్చరింప వగునచ్చెగు వెక్కుడి వశ్యవిద్యసం
సాధనచేసినావొ వహవా జగమంతయు నీకు వశ్యమై
నీదయ యాచు నెల్లపుడు నిన్నె స్మరించుచునుండుఁ గా. 25

ఉ. బీజము నాటి మొక్క మొలపించి కుజంబును జేసి పుష్పవి
భ్రాజితరీతిఁ జూపి ఫలభారవినమ్రము నొనర్చి యంతలో
భూజము బీజముం మృపయ పోలఁగఁ జూడుఁడటంచు జూపు ధీ
రాజితు నైంద్రజాలికుఁ గరమ్మును బోలెద వీవు కాలమా.

చ. చనుమ యుదీచి కన్నఁ జనుఁ జక్కఁగ దక్షిణమేగుచున్న న
ట్లన చను సూర్యసంతతి దృఢప్రథితప్రభుఁ డట్టిచో మఱ
వ్వనికిఁక నీదు నాజ్ఞ గడవందగు సంతతి ప్రజ్ఞ గల్గు న
త్యనుపమశక్తియు క్షమ! శుభాశుభమాలను! ఓసి కా. 27

ఉ. దిక్కుల కెక్కుడై తనరు తేజము నందగు పూర్ణచంద్రునో
క్కొక్కదినాని కొక్కగతి నొయ్యనక్షీణత నందఁ జేసి స
మ్యక్కమనీయకాంతియుతుఁడౌ గతి క్షీణు బ్రపూర్ణునట్ల
యొక్కొక్కదినానికొక్కగతి నొయ్యనఁ జేయవె! నీవు కా.

ఉ. చీఁకటినుండియే వెలుఁగు చిత్రముగా మృతినుండి ప్రాణముల్
శోక సుఖమ్ము కష్టమున శూన్యతనుండియె పూర్ణభావ మ
స్తోకపు రూపరూపమునఁ జొప్పడఁ జేయఁగ నేర్పుగల్గు ని
న్నే కవి యింతదానవని యేర్పడఁ జెప్పఁగ నేర్చుఁ గాలమా.

చ. రటదుత్తుంగతరంగసంగతగభీరంబైన సంద్రంబు పు
క్కిటఁ గంగాది మహానదీనదఝరీ కీలాలజాలంబు ను
త్కటరీతింగబళించుమాడ్కిని సమస్తప్రాణికోటిన్ హుటా
హుటినీపొట్టనఁబెట్టుకొందువయయో! ఒక్కప్పుడో కా. 30

చ. ప్రకటపదార్థముల్ విరులుపండ్లును బత్తులువృక్షజాతముల్
సకలముగల్గునీకతన సత్యము కర్తవు నీవ వాని కిం
తకుఫలమేమి? లోకులుగదా ఫలమందుట కూడఁబెట్టువాఁ
డొకఁడు, భుజించువాఁ డొకఁడహో యిదినైజము కాదె కా.

ఉ. కమ్మనిపూవుఁదేనెలుసుఖమ్ముగఁగ్రోలి మదించి మించిభృం
గమ్ములుఝుమ్ముఝుమ్మనుచుగానముసల్ప, రసాలపల్లవా
గ్రమ్ములు మెక్కినిక్కుచుఁబికమ్ములుగూయఁగ నవ్వఁడిచ్చు శ
క్తిమ్మహితాద్భుత ప్రవణధీయుతమా! అగుదీవ కాలమా.

చ. జలజలపండుటాకులు వెసన్ ధరరాలఁజివుళ్లు మొత్తముల్
బలసి తనర్చునట్టులె ప్రపంచమునందలి చావు పుట్టుకల్
సలలితరీతినంచును వసంతపుఁబాఠము బోధసేయు పం
తులవుగదమ్మ లోకులను తోరపుశిష్యులకీవు కాలమా.

చ. జగదుపకారకంబగు వసంతపుసంతను వాతపోతముల్
చిగురులుపూలుపుప్పొడులుచిక్కనితేనెలుచిల్కపల్కులున్
సొగసు పికధ్వనుల్ మధుపశోభన ఝంకృతు లమ్మకమ్ముసే
యఁగనెఱవర్తకుండవుగదా తగదానిను నెంచఁగాలమా.

చ. సరభసవృత్తి నిప్పులవసంతములాడు మహోష్ణవాయువి
స్ఫురణముతో జగద్భయదభూరిదవానలరాజితో జలా
కరముల నీరుఁబీల్చి వనకాండముఁగాల్చి జగంబుఁ బేల్చుదు
స్తరమగు గ్రీష్మరూప మొకసారివహింతువునీవ కాలమా.

చ. మలమలమండు వేసఁగులమాపుల వెన్నెల తిర్చి కాయఁగాఁ
బులినతలంబులన్ సొబగుపూవులఁ తావులు పిల్లవాయువు
ల్వేలయవిహారముల్ సలుపు పెద్దలు, వెన్నెలకుప్పలాడు పి
న్నలు తగనీమహత్త్వముఘనంబని యెంచరటమ్మ కాలమా.

ఉ. హాలికజాలహర్షదఘనాంబుదపఙ్క్తి నభోవిహారలీ
లాలలితంబుగాఁగ "సఫలంబులు యత్నము లింక పైనిదే
కాలమువచ్చె" నంచుఁగుతుకమ్మున నీ దగురాకకే జగ
జ్జాలము వేచియుండు ననిశమ్ము భృశమ్ము నిజమ్ము కాలమా.

శా. అంభోదప్రకరంబొగిన్ ప్రబలగర్జారావగంభీరమై
శుంభద్విద్యుదుదారభాసురమునై శోభిల్లనోకృష్టహో
కుంభద్రోణముగాగ వర్షము జగత్క్షోభప్రదప్రక్రియా
జృంభంబౌ నది యెల్ల నీమహిమమం చే నంతు నో కా.

చ. సరసులపోడిమిం జెఱచి సైకతభూములు; సైకతంబులన్
జెఱచిఁ సరోవరమ్ములుగఁ జేయుచు "జూడుఁడు కల్మి లేము లీ
కరణిఁ దిరమ్ముగాక కలకాలము వచ్చుచుఁ బోవుచుండు నం
చరమర లేక తెల్పెడు మహాగుణశాలివి నీవు కాలమా. 39

చ. చలి బలిపించి లేవయసుచానలకుం దగు కోడెకాండ్ర కీ
వెలమినిసూదికైన నెడమీయని మేల్ బిగికౌఁగిలింతలన్
బలుమఱుఁగూర్చి సమ్మదమొనర్తువు నీగుణమెంతయంచుఁ నే
బలుకఁగనేర్తు దంపతులపాలిటి దాదివి నీవు కాలమా. 40

చ. చలిబలిపించి లోకమును సంతసపెట్టెద నంచుఁ బొంగి బల్
కులుకకు బ్రహ్మచారులు, సళోయని ప్రోషితభర్తృకాళియు
న్వలిగొని దూరదేశముల వర్తిలుచుండు గృహస్థులెన్ని తి
ట్టులు నినుఁ దిట్టువారలో కదుం గఠినాత్మ యటంచుఁ గా.

చ. ఒకఘనుఁడెల్లవారుఁ దను "నొప్పెడు" రీతిఁజరింపదంపతి
ప్రకరము పాలికవ్రజము రాణ మయూరచయంబు సంతసం
బుకనగఁజేసెఁగాని కజపుంజము హంసబలంబు నేఁచె లే
డొకఁడును లోక మెల్లముద మొందఁగ జేయఁగలాడు కా.

ఉ. 'కొక్కొరొకొక్కొ' యోధ్వనులకుంఠితమంజులవేదనాదముల్
చక్కని నర్మకోపశమనప్రదవాక్కులు గానరూప స
మ్యక్కలనాదముల్ సతముమానుగ వేకువ నానెసంగు నీ
చొక్కపుఁదీరుఁజాటుబలుచోద్యపు వందిజనంబు కాలమా.

ఉ. విచ్చెడు సారసమ్ములు నవీనసుగంధము వెల్లిగొల్ప సొం
పచ్చుపడంగ మందమలయానిలపోతములోలిఁ గ్రాలఁ బై
పెచ్చుగ నండజప్రతతిపీనుల విందులు సేయఁగాఁ బ్రభా
తోచ్చదశ౯ దినర్చునినునొప్పనుతింపసతంబుఁ గాలమా.

II

ఉ. పాటిలఁజేసితీవు బహుభంగుల సంపదయు౯ నిరా
ఘాటకళావిలాసము లఖండముగా మును నాంధ్రభూమి నీ
నాఁటికి "సర్వమంగళ" మొనర్పఁగఁబూనితివేటికమ్మ "నా
నాఁటికిఁదీసిక"ట్టని జనమ్మునుసామెతరీతిఁ గాలమా. 45

చ. కలవు ప్రశస్తశాస్త్రములు కావలెనన్న, సమస్తవస్తుని
స్తులితము తెల్గుభూమి గుణతోయధులాంధ్రులులాభమేమి
మా పాలనుసు బెద్దచేసి తమపోడిమిమాయఁగఁజేయుజా
పువారలయిరి యొటికించుబరరాష్ట్రజనుల్ నగనేల కాలమా.

మ. తమశాస్త్రంబుల నెందఱో చదివి వైదగ్ధ్యంబును జెందఁజి
త్తములందెంచుక నానలేక నిజవిద్యల్ మానియాత్మీయది
వ్యమహత్త్వంబుడి పొవఁగా నితరవిద్యల్ నేర్వమీకేటికిం
చుమరల్పంగదవమ్మ యాంధ్రులనివేజోహారులో కాలమా.

ఉ. పూర్వపురాజులందుఁ గవిపుంగవులందు సమీకశూరతా
పూర్వహవులందు నీకుఁగలతోరపుఁబూరిమి నేఁడుఁగూడ మా
యుర్వరనాథులందుఁ గవితోజ్జ్వలులందు సమీకశూరతా
ఖర్వులయందు నున్న నిఁకఁ గాని ప్రయోజనమేమి కాలమా.

చ. కండలు కోసియిచ్చిన యఖండితదాన్యులు భారతీయు, లా
ఖండలతుల్యులై భువనగణ్యులు తెన్నుగ హైందవుల్ మహా
భండనభీములాంధ్రు లెటువంటి మహామహులైన నేమి నీ
యండఁదొలంగినం గృతినవ్యర్థులె యైరి నిజమ్ము కాలమా. 49

మ. ధరణీపాలనయోగ్యులాంధ్రు లసమర్థత్వప్రతిష్ఠన్ గటా
దురదృష్టంబునఁ జెందరిప్పటికి నీ దుశ్చేష్టచే నింత దా
సరమయ్యెన్ గరుణించియింకనయినన్ బ్రాగ్గీతిస్వాతంత్ర్య
భాస్వరులన్ సంగరశూరులన్ సలుప లేవా! యిస్సిరో! కా.

ఉ. ఒండొరుగన్న మేటి మతినుండగ హైందవలోకమౌటపైఁ
"బెంజిలి" యంచుఁ గొండడినిన నేఁడికిఁ గొండడుదంత్రిసంబునన్
కొండనుగావటంచుఁ జెలరేఁగు నొకండిది యేమికర్మమీ
వండ సడంపఁగాఁ దలఁపవా? అకసీ నిగాడ? కాలమా. 51

చ. పనిబడఁ బూర్వమాంధ్రులు కృపన్ విడనాడి కృపాణపాణులై
మొనమొనగాలు ద్రొక్కి రిపుపుంజము కుత్తుక లంటుగోసి ర
క్తనదులు పాఱఁ జేసిరి గదా ధృతిభారతభూమి యయ్యయో
అనదలు నేఁటికేలయిరి? యారయ హేతువ నీవ కాలమా.

ఉ. భారతభూమినిప్పటికి భారతవీరుల వింటి మ్రోఁతలున్
వారలసింహనాదము లవారిగ వాకక మాఱుమ్రోఁగెడిన్
వైరులగుండియల్ వగుల, వాని ప్రయోజనమేమి యింతకున్
నీరసులైరి హైందవులు నీదయ లేమినిఁ జేసి కాలమా. 53

ఉ. భోజునిఁగృష్ణరాణ్ణృపునిఁ బోలు నృపాలుర, నన్నపార్యధీ
రాజితతిక్కనాదికవిరాజులఁబోలుకవీంద్రులన్, స్ఫుర
త్తేజులభీమపార్థులకు దీటగుశూరుల, నాంధ్రమాతకే
యోజను వెండి కూర్ప దయయున్నదొ? నీకెదలేదొ? కా.

మ. ధనధాన్యంబులుకొల్లకొల్లయితర రాష్ట్రంబుల్ సమస్తంబు తే
వనుకోరాదు జనుల్లసద్వినుతయోగ్యశ్రీకు లాంధ్రావనిన్
గననింకేమిటఁ గల్గెనోకఱవెఱుంగన్ రాదు నీచెయ్దమి
ట్లనుసంధించెను గాక వేఱొకటి యజ్ఞానాహేతువౌ కా. 55

ఉ. ఎన్నిట నెన్ని చూచిననహీనమహోత్తమ వస్తుజాలసం
పన్నతఁగాంచియున్ జడులమాదిరి నాంధ్రులు నేఁడుగూడ తా
మన్నిటి కన్యదేశజులకాసవహించుట మాన రింటిలో
వెన్ననుగల్గి నేతి కొఱు వేఁడినరీతి నిదేల? కాలమా. 56

ఉ. రంగగువస్తుసంతతిఁ గరమ్మునగల్గియు నయ్యొ గ్రుక్కిళుల్
మ్రింగుచుఁగూరుచుండు తమరీతినిఁ జూచినవారలెల్లరున్
"అంగడిలోననన్నిగల వల్లునినోటమఱేమొ యున్నదన్
సంగతినిక్కమయ్యొ" యనసాగిరి తెల్పగదమ్మ. కాలమా. 57

III

శా. అన్యాచార విచారమేమిటికి మీయాచారముల్ ధీతురీ
ధన్యత్వంబుల వృద్ధిజేసికొని యంతర్వాణిసంస్తుత్యసా
జన్యప్రాభవమందుఁ డీపయినినేసాయమ్ము గావింతు నిం
కన్యోజింపఁగ నేటికంచనెదవా? కానిమ్ముహో కాలమా. 58

మ. ఘనసన్న్యాసము కాదు మ్రొక్కుబడియో కాదుత్తమాంగా
ర్తితాపనివృత్త్యర్థము కాదిఁకేమిఫలమున్ వాంఛించుటన్
ముండనంబును గావింపఁగఁబూని రాంధ్రులు నిజంబుం బల్కు
చో, నిష్ఠురంబను లోకంబగుఁగాక సీతన నేయంచందు నేఁ గా.

చ. విధవలఁ బెండ్లియాడెడు ప్రవీణులు; దేవుఁడు లేడటంచు దు
ష్పథమున వాదముల్ సలుపుపండితులున్ స్వమతంబుదిట్టు
మానసఘనులు పుత్రులైరని మనంబున భారతమాత కుందునీ
విధమున దుష్టచేష్టలవివేకితఁ జేసెదవేల కాలమా. 60

శా. కన్యాదానశుభక్రియాచరణవిఖ్యాతాంధ్రులన్ నాయురే
కన్యావిక్రయపాపకార్యకరణాఖండప్రభావాధికుల్
అన్యాయార్జితవిత్తవంతులు నసహ్యాచార విస్తారదా
ర్జన్యుల్ చేసితివేమి నేర్పిది పిశాచప్రాయదుష్కాలమా.

శా. కడుపారంగని పూవుఁబోండ్ల ధనకాంక్షన్ సంతలో గొడ్ల స
మ్మెడుచందంబున వర్ణభేదములకల్మిం గూడ పాటింపకే
బడుగుం బండకొ, గ్రుడ్డికో, వెడగుకో బల్మిన్ సమర్పించుక్రము
క్కడులీనాటికిఁ గల్గెరాంధ్రజననీ గర్భంబునన్ కాలమా.

మ. వరశుల్కంబను వ్యాధి యాంధ్రజనులన్ వ్యాపించి విత్తంబు
నానోఁ జపోమందునాఁగుచున్నయదియయ్యోయట్టిది వ్యాప
ధంబరయంగల్గని వారికష్టమిఁక నేలా నొక్క వాక్రువ్వ నీ
కరణిన్ లోకము నేఁచనీకుఁదగునా? కష్టంపుదుష్కాలమా.

ఉ. ఈవరశుల్కబాధకయి యీపఱకెందఱు పూవుఁబోఁడులో
హో విమలాంగవల్లుల హుతాశనకీలల పాలు జేసిరి
స్సీ! వివరింప నేమిటికి *స్నేహలతాదుల నీవెఱుంగవే
ఈవిలయంపుదుర్గతి యిఁకెన్నఁటికంతమునందుఁ గాలమా.

శా. తాళింగట్టినవాఁడు పోవు వెనుకన్ దత్కాంత కానాంధయై
తాళన్ లేకమఱొక్కనిన్ బడప నాతం డేఁగ వేఱొక్కనిన్
గాలంబాతఁడు సేయ నింకొకనిఁ దాఁ గామింపఁగావచ్చునం
చోలిన్ దీర్పులొనర్చు పండితులతో యోజించితే కా. 65

---

* స్నేహలతాదేవి చరిత్రము ప్రసిద్ధము.

ఉ. కామముతీరుదాఁక నొక కాంతుఁడు వేఱొక కాంతుఁగూడఁగా
నేమము సేయకున్న నలినీలక చల్ జెడిపోదురంచు నీ
నీమము చేసినారలట నేర్పున లింతకు మించు చెట్ట యిం
కేమిపడంతికిన్ గలుగు నీవు వచింపఁగదమ్మ కాలమా. 66

చ. జగమునుతింప వేదములు తలఁ గాలముఁ బుచ్చు విప్రులన్
వగవగఁ గూటసాక్ష్యములు పల్కఁగ, నీచుల పాదసేవ సే
యఁగ స్వమతాభిమానరహితాత్ములగాఁ బొనరించితిట్టి దుం
డగములు సేయన్యాయమగునా? తగునా? పగనైనఁ గా.

శా. ఆచారంబులుమాని రాజులు నిత్యాచార నిష్ఠాశుభ
శ్రీచాలంగనిరన్య లింతకును "నీరెండుర్ దురాచారదు
ర్ధీచాతుర్యధురీణతాస్పదులు లంతే కాని మేల్పూర్వం
చీచండంబులు కూడవం" చనఁగనీవే జంకెదో కాలమా.

మ. పశుహింసాపరులై సమూఢజనులున్మాంభ ప్యార్థముల్చెప్పుచున్
యశమార్జించుచునుండ పులిపుడన్యాయాన్నృతాపక్రియా
వశులై దుర్యశమున్ భృశమ్ముగని విప్రఖ్యాతిఁ బోకార్చి దు
ద్దశలంబుంగిరి త్రిప్పఁగాదెపముగాదా? నీకునుర్ గాలమా.

చ. మతములఁ గూర్చి నేఁడిచట మాన్యులు మీరలుపన్యసించి మా
కుతుకము దీర్పుఁడంచు ప్రజకోటియు కానొక మ్లేచ్ఛు గోరఁగా
నతఁ "డిఁక మీకిమాకి" యనియావల నేదియొ చెప్పదానిచే
నతితర మోదమందె ప్రజాళియు దెంత టివింత కాలమా.

మ. అకలంకాప్రతిమప్రతాప వితతుండై గండ్రగొడ్డంట రా
జకులంబుం దెగటార్చి శాత్రవశిరస్సంఘంబు స్వర్గంబు త్రో
వకు సోపానపుఁ బఙ్క్తిఁ జేసిన మహాబాహాబలప్రౌఢ వి
ప్రకులోత్తంసకుఁ డేడి? చూపఁగలవా? ప్రాడ్భాయిదు ప్కాల.

చ. మనమతమందు దేవుఁగను మార్గము మంచిది లేదటంచు నా
తనమతమందుఁ జేరి యటఁ దన్మతసారము నెత్తికెక్క మీ
ఱినవెత రెంటికిం జెడిన రేవడలై విలపించు హైందవుల్
నినుఁ బడఁదిట్టు తిట్టులవి నీకు వినంబడ వొక్కొ కాలమా.

ఉ. వేదములందు విప్రులకు, విప్రులయందునఁ దక్కువారికే
యాదృతి లేకపోయె ననమగ్రకలాకలనాతిగర్వులై
కాదనకార్యవాక్యములఖండన సేయఁగఁ జూచుచుండ్రు నా
సోదరు లీవు నూరకయ చూచుచునుండెద వేల? కాలమా.

చ. అనృతము బెల్లమయ్యె ఋతమన్న నసహ్యవిషంబుఁ బోలె స
జ్జనవచనంబు చేదు రుచిచాలఁగఁ దోఁచెను దుష్టవాక్కులన్
వినవిన వేదశాస్త్రములు వేఁదుఱువ్రాఁతలుగాఁగఁ దోఁచె భూ
జనులకు హేతువింతకును జాలెద నీవ యటంచుఁ గాలమా.

చ. గురులకుఁ బంగనామములు కూర్చెడు శిష్యులు తల్లిదండ్రులన్
సరగున వీడి యన్యమతసంగతిఁ గీడ్వడు పుత్త్రులున్ బరం
పరగ నొకండు పోవ నొక భర్తను గైకొనఁ గోరునాతు లీ
వఱకెటనైన నుండిరను వార్తలు వింటివె యమ్మ కాలమా. 75

ఉ. రాముని చర్య పుక్కిటిపురాణము, భారతగాథ కల్పనా
శ్రీమహిమాభిరామ మిఁక కృష్ణుని లీలలు నమ్మరాని వం
చీమెయి వాదముల్సలుపు నెడ్డెల కేదొ జవాబు చెప్పఁగా
నీమదినూహసేయ విది నేర్పరిలక్షణ మౌనె కాలమా. 76

చ. కలవు విమానముల్ మునుపగణ్యములంచు పఠించు పూర్వగా
థలు మృషలంచుఁ బల్కెడు విదగ్ధులమూర్తులు మూసినట్టుల
గ్గలముగ వ్యోమయానములఁ గ్రమ్మఱ నేఁటికి మాకుఁ జూపి పూ
ర్వులయశమున్ ధరాస్థలినిఁ బొల్పుగ నిల్పితి వమ్మ కాలమా.

IV

మ. జననాథుల్ తమకోర్కెలన్ మిగులవాత్సల్యంబునం దీర్పఁగా
ననయంబున్ సుఖియించుచున్ "సుకవితా యద్యస్తి రాజ్యేనకి"
మ్మని గర్వించిన సత్కవీశ్వరులు నేఁ డౌరా నిరాధారజీ
వనులై రీవుదయంగనుంగొనని టుల్ ప్రాప్తించునా? కాలమా.

మ. వరణీయప్రతిభుల్ పురాతనకవుల్ ప్రఖ్యాతిమై "నానృషిః
కురుతే కావ్య" మటన్నగౌరవము మీకుంగూర్చె రాగౌరవం
బఱ నో తెల్గు కవీంద్రులార! యిటు లేలా నీరసగ్రంథముల్
విరచింపంగ నటంచుఁ బల్కెదవు నీవే మూలమో కా.79

ఉ. తందనతాన లేలలు ముదంబెదఁ గూర్చునుగాని పద్యపుం
గందరగోళ మెవ్వరికిఁగావలె నుంతయుఁ దోఁప దర్థమున్
పందలదాతలన్ సలిపి వ్రాయుము గ్రంథములో కవీంద్రయుం
చుందలయూపె దేమిటికిఁ జోద్యము నీదగుచెయ్ది కాలమా.

మ. రసవద్గ్రంథ నిబంధనక్రమకళారాజత్కవివ్రాతమున్
రసన శ్రీచెడిపోవఁ బొట్టకయి దుర్మార్గ ప్రజాప్రార్థనా
వ్యసనాభ్యాసమునందుఁ దీర్చితివి యోగ్యాయోగ్యతల్ చూడ
వెట్లుసహింపంగలదమ్మయిందికఁ గవిరాల్లోకంబునిన్ గాలమా.

మ. ప్రతతోదారగుణాభిరామరసికోపఘ్నాళిఁ గవ్యాలవా
లతలన్ బూర్వపురీతి నొప్పెడునటుల్ గావించి, యెట్లేనిఁ బ్రో
న్నతి నుద్యత్కవితాలతావళికిఁ విన్నాణంబుగాఁ గూర్చి స
త్కృతులన్ పూవులుపూయ నీయఁగదవే? కీర్తింతునిన్ గా.

మ. "యతియుం బ్రాసము ధారకడ్డములు పద్యశ్రేణి వ్రాయంగ
వ్యాకృతియుం తేనియు దారికడ్డు వచనం బేనిన్ రచింపంగ" నం
చతివేల ప్రతికూలవాదచణులై యయ్యయ్యొ భాషాసతీ
ప్రతిపక్షుల్ చెలరేఁగి రేమిగతియో హాపై నాపెకో కాలమా.

మ. పసపుం గుంకుమగా నెసంగు యతియుం బ్రాసంబులా యార్యార
బస నొప్పారు కవిత్వకాంత కవియే వర్జ్యంబులం చెందఱో! ప్రుం
య సదుద్దేశమునన్ మహామహు లుపన్యాసంబులం జేయువా
రిసి! ముత్తైదువ నిట్లు చేయఁదగునా? హేయంబుగాఁ గాలమా.

మ. గరితల్ “మోమున బొట్టు మో” టన “నలంకారంబ నావశ్యని
ర్భరభారం” బన “స్వేచ్ఛగాఁ దిరుగ నేరంబా” యనన్ జెల్లెనా
కరణిన్నేఁ జరియింపఁ జెల్లద? యలంకారాదు లింకేటికా
బరువే నోల్లనటంచు మొఱ్ఱలిడెనా వాక్కాంతయుం గాలమా.

మ. “పచనం రాయడ మేంటి చూడర యెలా పజ్జాలు రాస్తానొ నూ
ట చమత్కారము నాకు మల్లె మటి ఆడా చేస్తె? చెయ్యాలి శిం
దెచ వాకుల్ల నడాని కేమి” యనురీతిన్ బద్దెముల్ గిల్కఁజూ
చుచునున్నా రొకకొంతమంది తగదంచుం దెల్పవే కాలమా.

ఉ. ఆశువుగాఁ గఁ గొందఱు మహాశువుగా మఱికొంతమందియు
త్యాశువుగాఁ గఁ గొంద ఱసియాడఁగ నీకకవిత్వకాంత వి
త్రాశను లాగ సాగిరి నిరంకుశకుక్షులు; పండితుల్ ధరా
ధీశులునట్టి వారి సహియింతురు మెత్తురి దేల కాలమా. 87

చ. పలికిన పల్కు పద్యమయి పండిత సమ్మతమై లసత్ రసం
బులగనియై స్వభావగుణ పోషకమై మృదురీతిముద్దులం
గులుకఁగఁ బల్క నేర్పుగల కోవిదుఁడే కవిగాక పొల్లులం
గిలికెడు వారలెల్ల కవికీర్తికి నర్హులటమ్మ కాలమా. 88

చ. కవి కవితల్ రచించిన నొకండును మెచ్చియొసంగువాఁడు లే
డవిరళదాత తత్కృతుల నచ్చొనరించియు నమ్మి పొట్టపూ
డ్చవలసి వచ్చెఁ గాగితము సైతము కర్వయిపోయెనిప్డె సీ
“కవియయిపుట్టుకంటె నిలఁ గష్టము లేద” నిపించెఁ గాలమా.

ఉ. "ఆ" యనదోస "మూ" యనినవంతకుమించినగొప్పతప్పు "నా
రాయణ" యన్న బూతుపద మన్నవిధంబునదిద్ది, పండితా
పాయ్యయనముంబొనర్చుగృతు లచ్చునఁగూర్పఁగరాదటంచున
న్యాయపు "రూల్సు" పుట్టినిక నాంధ్రకృతుల్ మను టెట్లుకా.

శా. మావర్ణాశ్రమధర్మముల్ నళులశుంభద్రీతిసాగింపఁగా
మావిద్యల్ నళులన్సమగ్రగతినభ్యాసంబుల న్సేయఁగా [గా
మానంతల్ తొలఁగించిపూర్వమువలెన్ మమ్మున్ గృపంజూడఁ
నీవేదిక్కని నిన్నె నమ్మితిమి మన్నింపంగదే కాలమా. 91

శా. నీయాజ్ఞన్ సృజియించు లోకవితతిన్ నీరేజగర్భుండు తా
నీయాజ్ఞన్ మనుచున్ దయాళుఁడగుచున్ నీరేజనాభుండు పై
నీయాజ్ఞన్ సమయించురుద్రుఁడగుచున్ నీరేజనేత్రుండు వా
హ్వాయేమంచునుతింతునీదయినమాహాత్మ్యంబునో కా. 92

ఉ. నాలుగుమోముల న్వెలసినన్ మఱియైదుమొగాలనొప్పినన్
జాలగ నాలుమోములపసన్ దనరారిన నైదు రెండ్లుగాఁ
జాలుపుగొన్నమోములయశంబునుగాంచినగానిజూడఁగా
జాలరునీదుమోమునఁగ జంకుదయింపదదేమొ కాలమా. 93

మ. సికరోమ్ముండనమోకిరీటమొకో వాసిన్ టోపియోమంచిపా
దుకలో బూటులొ సూటొ దువ్వలుయొ తోరంపుటొడ్డాణమో
రకపుం జర్మపుబెల్టొ చూ చెదము నీరంగారు సింగార మే
రకమో మాకొక మాటుదర్శనము నీరాదా అహోహో కా.

చ. కనుగొనుచుంటి వీవు చిరకాలమునుండి జగత్స్థితిన్ నిజం
బును వచియింపుమిట్లు చెడిపోయెనె యెన్నఁడుఁగాని నీతరం
బున! నిటులాటనీమయశమున్ జెడెఁ నింతకుమించె నేనిద్ర
ప్పను భర మయ్యెడున్ నిజముపల్కితి నీమనసింకఁగా. 95

ఉ. ఏవిధమైనకీడు ఘటియిల్లిన లోకము నిన్నె తిట్టెడిన్
గావునఁ దెల్వి దెచ్చుకొని సల్గురినోళ్లను నానఁబోక వి
ద్యావిదులెల్ల రౌనన యథావిధి లోకము నెప్పటట్లమేల్
త్రోవకుఁ ద్రిప్పు మట్లయినఁ దొంటిగతిన్ యశమబ్బుఁగా.
చ. వినుకలిసేయు నీ బ్రదుకు విష్ణుపురాణమె యెల్లవారికిం
కనుగ్రృతులందుఁ దిట్లుదినఁగానతెనా కవిరాజరాజిచే
మనుము సుఖస్థితిన్ జగము మాన్యగతి న్నడిపించినానుడిన్
విను వినవేనిఁ దత్ఫలము నీకె యెఱుంగఁగ నౌనుగాలమా.
మత్త. ఎన్నఁజొచ్చెను మిన్నయై సను నీవెఁడెంతటి వాఁడటం
చు న్ననుం గసలంగఁ బోకుము చూపితిం గలలోపముల్
క్రన్నన న్సవరించి తేని సుఖమ్ము మాకగు నీకునా
నున్నమాట వచింప నేమిటికిలుకుఁ జెందఁగఁ గాలమా.
జగము సుఖముగోరి సల్పితి నీకృతిన్
జగతిసరయనీ ప్రచారణముండు దా
కఁగృపఁ గృతిస్థిరంబుగా నపరాజితం
బుగ నిలుపుము నీకు మ్రొక్కెదఁ గాలమా ! 99

స్థిరతరం బయి జగద్విఖ్యాతి నొంద

వరుసఁ బండితసత్కృపం బెంపు వడసి

తనరు నీ కృతి గురుదయ.

ఇట్లు
సుకవి వినతుఁడు,
దీపాల పిచ్చయ్యశాస్త్రి.

# ప్రకటన

---

## 1. చాటుపద్య రత్నాకరము

శ్రీనాథుఁడు, పెద్దన, తెనాలిరామకృష్ణుఁడు మొదలగు మహాకవులచే సమయోచితముగా రచింపఁబడిన పద్యరత్నములు. పొట్టలుబ్బ నవ్వించు హాస్యపద్యములు ; తనువు పులకరింపఁజేయు శృంగారపద్యములు ; సన్మార్గమును బోధించు నీతిపద్యములు ; పూర్వకవుల ప్రతిభావిశేషమును వెల్లడించు వాదప్రతివాదపద్యములు ; దేశ పూర్వ స్థితినిఁ దెలుపు చరిత్రాత్మక పద్యములు ; నిందు రమారమి 600 కలవు. ఈ పద్యము లిదివఱకెవరిచేతను బ్రకటింపఁబడలేదు.

మాదిరికొకపద్యము :— శ్రీనాథమహాకవి యొకనాఁటి పయనమున మార్గమధ్యమున దాహమయి నీరు ద్రావ నొకబావికిఁ బోవఁగా నందు నీరులేక పోయెనఁట. అప్పుడు కవీంద్రుఁ డీశ్వరునిఁ గూర్చి యిట్లు ప్రార్థించెను.

"క. సిరిగల వానికిఁ జెల్లును
తరుణులఁ బదియాఱు వేలఁ దగఁ బెండ్లాడన్
దిరిపెమున కిద్దరాండ్రా ?
పరమేశా ! గంగవిడుము పార్వతి చాలున్."

ఇట్టికథ లెన్నేని గలవు. వెల రు. 1-0-0.

ఈగ్రంథముపై నెందఱో మహామహు లభిప్రాయముల నొసంగియున్నారు. గ్రంథవిస్తరభీతిచే నొకరిద్దరి యభిప్రాయములను మాత్రమిందుఁ బొందుపరచెదను :—

మ-రా-రా|| శ్రీ, నాగపూడి కుప్పుసామయ్య, బి. ఏ., గారిట్లు వ్రాసిరి.

బ్రహ్మశ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారికి, తిరుపతి,

నమస్కారములు. 10-12-1917

తమరు సాదరంబుగఁబంపిన "చాటుపద్యరత్నాకరము" నాకరంబలంకరించి నామదింగరంబలరించె. అందుఁగూర్చియున్న పద్యములలోఁ గొన్ని వాడుకలోనున్నను దక్కినవి యశ్రుతచరంబులు. వానిలో ననేకపద్యము లెంతయు రసవంతములై సహృదయుల కింపుసంపాదింప నోపియున్నవి. తొండమాన్ ప్రభుండగు విజయరఘునాథ మహీనాథునిగూర్చియు, మధురాధినాథుఁడగు విజయరంగ చొక్కనాథునిగూర్చియుఁ జెప్పఁబడిన పద్యములు హృద్యములై యొప్పారెడు. అవి దక్షిణదేశంబునంగాని లభింపవుగదా ? మీరచ్చట నెంతకష్టపడి వానిని సంపాదించితిరో యెఱుంగనయ్యెద. వెండియు నితరవిషయములంగూర్చి చెప్పఁబడిన పద్యములును గడురమ్యంబులైయున్నవి. వానిం జెప్పిన మహాకవులనామంబు లప్రసిద్ధంబులై యడఁగియుండ మీరు వాని నాంధ్రలోకంబున శాశ్వతంబుగ నిలిపి యాంధ్రులకృతజ్ఞతకుఁ బాత్రులైతిరి..............ఇట్టి మనోజ్ఞకవనంబునుఁ బొనుంగుపడనీక యతిప్రయాసంబున నూరూరు తిరిగి వానిని సేకరించి గ్రంథరూపంబునఁ బ్రకటించి యాంధ్రలోకంబున కుపకృతి కావించిన.........మీరు నిఖిలజన ప్రశంసాపాత్రులరని వేఱచెప్పవలయునే ? నూతన గ్రంథరచనకంటె నింతకుమున్ను మహాకవులు వ్రాసిన వాని నుత్సన్నములు కాకుండఁ బ్రకటించుట యాంధ్రభాషకుఁ బరమోపకారంబు చేసినట్లు భావించెద. ఈపద్ధతి నవ్యంబయ్యు నెంతయు భవ్యంబై యలరారెడు.

* * * ఇవ్వియ పెక్కునతులు,

విపశ్చిద్విధేయుఁడు,

నాగపూడి కుప్పుసామయ్య.

P. BHASKARA RAU, L.M.P.
Regd. Medical Practitioner.

౧౦ ఆలంగాతపిళ్లై వీధి,
తిరువళ్లిక్కేణి,
చెన్నపట్నం.

సుహృద్వరా !

......తమచే ప్రచురించబడిన "చాటుపద్యరత్నాకరము" నన్ను తమకు కృతజ్ఞతగలిగిన విధేయునిగా జేసినది. నన్నే గాదు, ఆంధ్రదేశములో ననేకవేలమందిని.........సంతోషింపజేసినది. ముద్రించుటకు ధనమున్ను ప్రచురించుటకు సాహసమున్ను గలిగిన ప్రతివాడును, ఇష్టమువచ్చిన వ్రాతలను వ్రాసి గ్రంథమాలికలని పేరుబెట్టి మిత్రబృందమును—బలవంతపు బ్రాహ్మణార్థముగా—చందాదారులుగజేసి బాధించుచున్న యీ రోజులలో వ్యయప్రయాసములకోర్చి మీరు అధికప్రయత్నమున నీపద్యములనుచేర్చి యాంధ్రవాఙ్మయమునకు అత్యంతోపకారముచేసి ఆంధ్రులకృతజ్ఞతాపూర్వకములగు వందనములకు పాత్రులైతిరి...............విధేయుఁడు,

పూ. భాస్కరరావు.

---

## ౨. భారతి

"ఉ. భూపతిఁ జంపితిన్ మగఁడు భూరిభుజంగము చేతఁ జచ్చెనే
నాపద చెందిచెంది యుదయార్కుని పట్టముఁజేరి వేశ్యనై
పాపము గట్టుకొంటి తన పట్టి విటుండని కౌఁగిలించి సం
తాపము జెంది యగ్గిఁబడి దగ్ధునుగాకిటు గొల్లభామనై
యీపని కొప్పుకొంటి నృపతీ! వగపేటికిఁ జల్లచిందినన్."

అను చాటు పద్యములోని కథ, కల్పనముహృదయంగమము. శైలిసరళము, మృదులము. క్రొత్తమార్గము. వర్ణనములు స్వాభావికములు. వెల రు. 0-10-0.

---

## 3. భక్తకల్పద్రుమము

భక్తిరసభరితము. శతకము. వెల రు. 0-2-0.

---

## 4. విష్ణూపదశావతార స్తవము

తెనాలిరామకృష్ణమహాకవిచే రచింపఁబడిన ప్రౌఢపద్యములు. కురవి రామకవికృత సంస్కృతవ్యాఖ్యయు, మాచే వ్రాయఁబడిన ప్రతిపదాంధ్ర టీకా తాత్పర్యభావములును గలవు. వెల రు. 0-4-0.

---

## 5. సుభాషిత సుధాలహరి

ప్రాచీన కవికృత బహుగ్రంథములనుండి యేర్పఱుపఁబడిన నానావిధ నీతిపద్యములు. రమారమి 800. భర్తృహరి సుభాషితపద్ధతిని సమకూర్పఁబడిన గ్రంథము. పిన్నలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు నెల్లరు చదివి తీరవలసిన కబ్బము. విద్యార్థుల కవశ్యపఠనీయము — వెలువడుచున్నది. ముందార్డరు పంపువారికి తపాలాఖర్చులుండవు.

మా గ్రంథములను మొత్తముగాఁ దీయువారికి కమీషనియ్యఁబడును.

అడ్రెస్ —

డి. పి. శాస్త్రి,

నెల్లూరు.

---

చెన్నపురి : ఆనందముద్రణాలయమున ముద్రితము — 1920.